# హరిదాసి

[పావై పాటల్ స్వేచ్ఛానువాదము]



## సమర్పణము

చిన్నతనమునందే మాతృవిహీనుడనైన నన్ను లాలించి పాలించి
ముద్దుజేసిన ఒక
**వైష్ణవ భక్తురాలికి పుష్పాంజలులతో**






కూర్పు

**పి. దుర్గారావు,** యం. ఓ. యల్.

ప్రథమ ముద్రణము వేయి ప్రతులు



రుధిరోద్గారి నామ సంవత్సరము - హేమంతము మార్గళి

జనవరి - 1984

మూల్యము రెండు రూపాయలు

ముద్రణము

"వేంకట రత్నా" విజయవాడ-2

---

ప్రతులకు

**పి. దుర్గారావు**, యం. ఓ. యల్.

చెరుకుపల్లి పోస్టు, (వయా) నక్రేకల్,

నక్రేకల్ తాలూకా, నల్లగొండ జిల్లా

# వినయ వాక్యము

శ్రీ లక్ష్మీదేవి యవతారమైన శ్రీ గోదాదేవి పాడిన మంగళ మహోజ్జ్వలములు మధురభక్తి ప్రవాహములైన తిరుప్పావై గీతములు వైష్ణవ భక్తి సాంప్రదాయానుయాయులకే గాక సర్వులకు పవిత్రములైనవి ఈ గీతములు తమిళభాషలో గలవు

విష్ణ్వాలయములలో నిత్యానుసంధానము చేయు నీ గీతములు పెక్కుభాషలలో ననువదింపబడినవి తెలుగు భాషలో గూడ యెందరో మహానుభావులు తిరుప్పావై గీతములను గద్యపద్య గీతికా రూపములనే గాక విపుల వ్యాఖ్యలతో ప్రచురించిరి

కొంతకాలము క్రిందట యీ తిరుప్పావై గీతములను మహాకవి శ్రీ శే దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారు తెలుగు భాషలో గీతికా రూపమున ననువదించిరి ఈ మధ్యనే రసజ్ఞులు శ్రీ ముద్రాల జూనియర్ గారు వారి షష్టిపూర్తి సందర్భమున తిరుప్పావై గీతములను గీతికా రూపమున ప్రకటించిరి

ఆ రెండు పుస్తకములను ఈమధ్యనే పరికించుట జరిగినది ఆ గీతములయెడ నాకు గలిగిన యాసక్తివలన తిరుప్పావైకి సంబంధించిన ఒకటి రెండు వ్యాఖ్యలను గూడ పరికించితిని నేనదివరకే కృష్ణభక్తితో గూడిన గీతములు ఒకటి రెండు పుస్తకములు రచించి ప్రచురించుటచేతను కృష్ణభక్తితో గూడిన యీ మధురగీతములు నన్నాకర్షించినవి

నాకు గొప్ప కుతూహలశక్తిలేక పోయినప్పటికి తమిళము రాకపోయినప్పటికి ఈ తిరుప్పావై గీతములను రచించుటకు బూనుకొంటిని అనగా నాంధ్రీకరింపబడిన తిరుప్పావై గీతములను వ్యాఖ్యలను జూచి అనుకరించితినన్నమాట

అయినను తిరుప్పావై గీతముల యెడ నాకు గల ఆసక్తిచేత నాకు తోచిన రీతిలో స్వేచ్ఛానువాదమును గావించితిని పాడుకొనుటకు వీలుగా గీతములన్నియు ఒకేఛందస్సులో గూర్చవలెనని ప్రతి గీతమును ఇరువది పంక్తులలో గూర్చితిని

# శ్రీ గోదాదేవి చరిత్ర

శ్రీవిల్లిపుత్తూరునందు విష్ణుచిత్తుడు (పెరియాళ్వారు) అను హరిభక్తుడు గలడు అతడు పరమ విష్ణుభక్తుడు అతడు తన పెరటిలో తులసివనము పెంచుచుండెను అతడు ప్రతిదినము తన పెరటిలోని తులసీదళములతోను పూవులతోను దండలుగ్రుచ్చి ఆలయమూర్తియగు మన్నారుదేవునికి (శ్రీకృష్ణస్వామికి) సమర్పించుచుండెడివాడు స్వామికావెలనుండి తీర్థప్రసాదములు గ్రహించి తిరిగి వచ్చుచుండెడివాడు

ఒకనాడు విష్ణుచిత్తుడు యథాప్రకారముగా స్వామికి మాల్యము లర్పించి తిరిగివచ్చునప్పటికి తులసి వనమునందొక బాలిక కనిపించెను అతడా బాలికను గోదా యని పేరు పెట్టుకొని పెంచెను గోదా యనగా భూదేవి యనియు పూలమాల యనియు అర్థము

శ్రీ గోదాదేవి క్రమముగా పెరిగి పెద్దదగుచుండెను ఆమె వయసుతోపాటు విష్ణుభక్తికూడ వృద్ధియగు చుండెను ఆమె విష్ణుదేవుని వరించి మనసున ప్రేమించు చుండెను ఈమెకు ఆండాళు అనికూడ పేరు గలదు ఆండాళు అనగా లక్ష్మీదేవియని తమిళమున యర్థము.

శ్రీ గోదాదేవి ప్రతిరోజు విష్ణుచిత్తుడు శ్రీ స్వామికి తీసుకొనిపోవు మాల్యములను ధరించి తాను స్వామికి తగుదునా యని నిర్మలమగు బావియందును అద్దమునందును తన ప్రతిబింబముచూచుకొని యా మాల్యములను యథాప్రకారముగ బుట్టలో నుంచుచుండెను ఆ ఆముక్త మాల్యములనే విష్ణుచిత్తుడు స్వామికి సమర్పించుట జరుగు చుండెడిది.

ఒక దినమున విష్ణుచిత్తుడు స్వామి కర్పించు పూమాలల యందు ఒక దీర్ఘకేశమును జూచి శ్రీ గోదా దేవిని ప్రశ్నించును ఆమె మాల్యములను ప్రతిదినము నలంకరించుకొని బుట్టలో బెట్టుచుండునని విషయమును దెలుపును అతడు శ్రీ గోదాదేవిని మందలించి నూతన మాల్యములను స్వామికి దీసుకొని పోవును

విష్ణుచిత్తుడు తెచ్చిన నూతన మాల్యములు స్వామి మూర్తిపై నిలువలేదు విష్ణుచిత్తుడు కలతజెందెను. స్వామి స్వప్నమందు సాక్షాత్

రించి నీ సొమరిత ధరించిన మాల్యములే నాకు మక్కువ" అని వ్రాకుచ్చును

శ్రీ గోదాదేవిని తమిళములో చూడ కుడుత్త నాంచారు" అని అందురు అనగా ధరించిన పూలదండ నిచ్చునది అని యర్థము ఈ "చూడికుడుత్త పదమునే సంస్కృతీకరించి ఆముక్త మాల్యద అని పేరుపెట్టి సాహితీ సమరాంగణ చక్రవర్తి శ్రీకృష్ణ దేవరాయల వారు గొప్ప ప్రబంధమును రచించిరి

విష్ణుచిత్తుడు తనకుమార్తె శ్రీ గోదాదేవి విరహవేదనను మన్నారు స్వామికి విన్నవించుకొనును। స్వామి ప్రత్యక్షమై ఆమెను శ్రీరంగనాధుని ఎదకు తీసుకొని పొమ్మనెను విష్ణుచిత్తుడట్లే తనకుమార్తెను శ్రీరంగము నకు తీసుకొని పోయెను।

శ్రీరంగమున దు విష్ణుచిత్తుడు శ్రీరంగనాధుని సేవించి స్తుతించెను శ్రీరంగనాధుడు అతని మనస్సునందుగల కోరికను తెలిసికొని గోదా దేవిని తన శుద్ధాంతమునకు చేర్చుకొనెను। ఒక మాయారూపిణిని ఆస్థానమం దుంచెను।

తీర్థ ప్రసాదములు స్వీకరించిన తరువాత అందరు విడిదికి వచ్చిరి కాని పల్లకిలో శ్రీ గోదాదేవి కనిపించలేదు విష్ణుచిత్తుడు దుఃఖించుచుపోయి శ్రీరంగనాధస్వామికి విన్నవించుకొనును। స్వామి కూతునింటివద్దనుంచు కుని యిచ్చట మొఱపెట్టుట న్యాయముకాదని శ్రీరంగనాధుడు పలికెను। విష్ణు చిత్తుడు తన విడిదికి పోయిచూడగా శ్రీ గోదాదేవి యచ్చటనే యుండెను

తరువాత విష్ణుచిత్తునకు శ్రీరంగనాథస్వామి శ్రీ గోదాదేవి యందు తనకు గల ప్రేమను వ్యక్తము చేయును బ్రహ్మాది దేవతలను రాయబార మంపును విష్ణుచిత్తుడంగీకరించు స్వామి తన గ్రామమైన విల్లిపుత్తూరునకు పరివారముతో వచ్చినచో పాణిగ్రహణముసేతునని పలుకును

అట్లే స్వామి తన పరివారముతో విల్లిపుత్తూరునకు వచ్చి శ్రీగోదా దేవిని వివాహమాడుట జరుగును ఈ కథా వృత్తాంతమునే గైకొని శ్రీకృష్ణ దేవరాయల వారు ఆముక్తమాల్యద ను రచించిరి

తన చెలులతో నిల మున్గాడి స్వామి మందిరమున కేతెంచి ద్వార రక్షకులకు వందనము చేయుంచుట పదునేడవ గీతమునుండి యిరువది మూడవ గీతము వరకు స్వామిని ఇతర దేవతలను మేలు కొలుపుట ఇరువది నాల్గవ గీతము స్వామిని దర్శించి మంగళనీరాజన మిచ్చుట గలదు

ఇరువదియైదు ఇరువది యారవ గీతముల పరవాద్య ములవ్వుమని స్వామిని వేడుకొనుట (పరవాద్యమునగా శంఖములు వాద్యములు పెద్దతాళ్ళు దీపమాలా స్తంభములు ధ్వజములు వితానములు తులసీదళ మాలలు మున్నగునవి) ఇరువదియేడవ గీతమున వ్రతసమాప్తివేళ మున నన్ని కోరికలను యాచించుట ఇరువది యెనిమిది ఇరువది తొమ్మిది గీతముల జన్మ జన్మలకు ఆత్మయున్నంత వరకు భక్తిని బాంధవ్యమును కోరుకొనుట ముప్పదవ గీతము మంగళాశాసనముతో సమాప్తమగును

మార్గశిర్ర వ్రత మనగా ధనుర్మాస వ్రతమని యర్థము సూర్యుడు ధనుస్సునందు ప్రవేశించినది మొదలు మకరరాశిలో ప్రవేశించునంత వరకు (ముప్పది దినములు) కన్యలు యీ వ్రతమాచరింతురు ఈ వ్రతమాచరించినందున కన్యలు కోరిన వరుని పొందుదురనియు చక్కని వర్షములతో దేశము సుభిక్షముగా నుండుననియు పురాణములలో చెప్పబడినది గోపకాంతలు ఈ ధనుర్మాసమున కాత్యాయనీదేవి వ్రతమాచరించినట్లుగను శ్రీహరిని పొందినట్లుగను శ్రీమద్భాగవతమునందు గలదు

శ్రీగోదాదేవి కలియుగమున అందునను దక్షిణభారతమున జన్మించినది. తాను పొందదలచిన వరుడు సర్వవ్యాపకుడైన శ్రీకృష్ణుడు భగవంతుని యవతారములలోగూడ శ్రీకృష్ణుని యవతారమువలె జీవులతో సన్నిహితత్వము మరి యే అవతారమునను గనుపడదు అందువలననే ఆమె శ్రీనందగోప కుమారుని ప్రేమించినది

తాను ప్రేమించిన నందగోపకుమారుడు గోపికలు వ్రేపల్లె యమునానది మున్నగునవి లేవు తానున్నది కలియుగమున తానేమో నందగోపకుమారుని ప్రేమించినది అదెట్లు సాధ్యపడును ?

అందువలన శ్రీ గోదాదేవి తననొక గోపకన్యగా తన చెలులను గోపికలుగా విల్లిపుత్తూరునే వ్రేపల్లెగా సమీపముననున్న నదినే యమున-

తన గ్రామమునగల మన్నారు కృష్ణస్వామి మందిరమునే నందగోపకుమారుని మందిరముగా భావించి అలనాడు గోపకన్యలు వ్రతమాచరించినట్లుల తానును వ్రతమాచరించినది గోపకాంతలు శ్రీకృష్ణుని పొందినట్లుల శ్రీ గోదాదేవియు హరిని పొందినది పొందుటయేగాదు పరిణయమైనది

శ్రీమద్భాగవతమునందు గోపకాంతలు హరిని పొందుటకు యమునలో జలకమునాడి శ్రీ కాత్యాయనీదేవిని పూజించినట్లు గలదు శ్రీగోదాదేవి అటులగాక జలకమునాడి రేపల్లెగా హరినే పూజించుట తిరుప్పావై గీతములందు గలదు

తిరుప్పావై గీతములందు స్వామిని వ్రత నిర్వహణమునకు పర వాద్యములనిమ్మని వేడుటగలదు ఇట్టి వ్రతపుకరములనుగాక నిశ్చలమైన భక్తియని గూడనర్థము చెప్పవచ్చును పరమార్థమును బొందుటకు భక్తి యావశ్యకమనియు భక్తిగూడ పరమేశ్వరానుగ్రహమువలన సిద్ధించుననియు అందువలన భక్తిని ముందుగా సాధించి భక్తిద్వార పరమార్థమును సాధింప వలయునని గూడ స్వామి చేసినాన చెప్పను

ఇందలి ప్రతిపాశురము స్వామియందు ప్రణయము బాంధవ్యము భక్తియనుభవింపవలెనను భావము వ్యక్తమగుచున్నది శ్రీ మద్భగవద్గీతయందలి చరమ శ్లోకమువలె తిరుప్పావై నందలి 28 29 పాశురములు ప్రధానములైనవి ఆ గీతములు భగవంతునికి ఆత్మసమర్పణము గావించి ఆత్మయున్నంతవరకు భక్తిని బాంధవ్యమును గోరుచున్నవి

శ్రీయుత డా॥ ఆరిపిరాల విశ్వంగారు శ్రీ సముద్రాల వారి "కృష్ణభాషా పీఠికలో" తెలిపినట్లు "గోదాదేవి పరవశ భక్తిగానం శతాంతాల వేనవేల యుగాంతాల దనుక పరిస్పందించే ప్రణవ పరంపర"

అట్టి మహనీయ గీతములకు అనుకరణములగు అనుకరణమైన నా యీ గీతములు సహృదయుల నేమాత్రము పరిస్పందింపజేసినను ధన్యునిగా భావించుకొందును పరమ పవిత్రమైన యీ మార్గశీర్షియందే యీ గీతములను రచించి ప్రచురించుట నా భాగ్యముగా భావించుచున్నాడను

—రచయిత

# హరి దాసి

[సాంటి ప్రెల హల్లొట్టయి]

అమ్మలారా! రండి! కొమ్మలారా! రండి
వ్రేపల్లె గోపకన్నెలలా
క స్నానాలకో కలికములు కలాత
కడువేడ్క భక్తితో కదిలి రారె చెలులు

మాధవుని హృద్యైన మార్గశిర మాసమిది
పూర్ణిమా దినమే! ధనుర్మాసము వెన్నెలే!
మార్గళీ వ్రతముతో మాధవుని పూజింప
మనసు శాంతిమి గదే! మానినులు మేల్కొనుడు!

బాలార్కుని ప్రభ ప్రభవమొందక మునుపు
జలకంబులాడగా చెలులు వేగిరరె!
హరిని పూజింపవలె అర్చనల కీర్తనల!
ఆత్మార్పణము సేయ అతివలారా! రండు!

కలువ కన్నులతోడ కదలాడు ముంగురుల
అల యశోదకు ముద్దు లలరారు మురిపెంబు!
చంద్ర బింబము బోలు అందాల మోముతో
నంద నిలయము బెరుగు నడయాడు బాలుడే!

శ్యామసుందరుడు! శుభ రాముడే! పరమాత్మ
రూపుడే! మన వ్రతము ప్రాపు! ప్రోచెడివాడు!
పరవాద్యముల నొసగి పాలించు మన వ్రతము
జలకంబులాడ జ జాతులందరు రారె!

హరి దాసి

# 6

చెలియా! తెల్లవారె చిన్నారి! పొన్నారి!
నిదుర లేవే చెలియా! నిదుర లేవవే!

సిందూర వన్నె వెలిచె చిత్రముగ తూర్పుదెస
కనవె కెంపు మాయె బంగారు కాంతులుగా!

చిలుక గోరింక లవె చెట్టుకొమ్మ పైని
కిలకిలా రావముల క్రీగంటి! వినవమ్మ
గుడిగంట లవె మ్రోగె! ముడివడిన భక్తితో
స్నానమాచరిమ్మ సఖియా! నిద్దుర లేచి!

అఖిలేశ్వరుండౌ శ్రీ అచ్యుతాలయము కడ
శంఖనాదము లవిగో! ప్రాణ! వినలేవమ్మ?
వేదపఠనము లవిగో వినిపించరావటే?
హరి మాధవా! యనెడి యర్చించు కీర్తనలు!

విషపు చను పాల్ద్రాగి విదిలించి రక్కసిని!
మధురమూర్తిని జేసి మన్నించు శ్రీనిధిని!
మా యశోదటుని వెన్ని మర్దించువాని! 'హే!
పతితపావన!' యనెడి ప్రార్థనలు వినరావ?

పాలకడలిని పాము పాన్పుపై నిదురించు
పరమేశ్వరుని మనసు భక్తితో భావించి!
ఋషులు, యోగులు మునులు కృష్ణ! కృష్ణా! యనెడి
ధ్యానించు, భజియించు ధ్వనులు వినరావటే?

# 7

ఓసి! లేజవరాలా! ఓసి వ్రజ వగలాడి!
వినలేవటే చెవులు? కనలేవటే కనులు?

మాధవాలయమందు మధుర గీత ధ్వనులు
శుభనాదములు సుంత సుదతి! వినరావటే?

వానకోయిల పలుకు వార్త వినరాదటే?
పంజరములో చిలుక పలుకు వినరాదటే?
తెలవారి వచ్చెనే! చెలియ నిద్దుర లెమ్ము!
జలజాక్షు బూజింప జక బులాడదము!

కంఠహారములు ఘలుఘల్లు మనుచు నుండ
కటిసూత్రములు వింత కాంతులీనుచు నుండ!
కురుల పూవాసనల గోపకాంతలు లేచి
కవ్వముల తఱచేటి సవ్వడుల వినరావ?
కేశి రక్కసు ద్రుంచి వాసికెక్కిన వాని
హరి! కృష్ణ! మాధవా! యచ్యుతా! యని మేము
నిఖిలేశు గుణములను నీ వాకిటను నిలిచి
సంకీర్తనలు పాడ సఖియ! వినరావటే?

ఇంత నిద్దుర తగునె? ఇంతి! ఓ చేమంతి!
ఓ చిన్ని దొరసాని! ఓ యిందు వదనా!
తలవాకిలిని తెఱచి తరలిరావే వేగ!
తాన మాడగ చెలులు తరలిపోసాగిరే!

# 8

ఇకనా యీ నిదుర? ఇంకనా పవళింపు?
చాలు చాలే నిదుర! సఖియ వే లేవే!

మార్గళీ మాసమున మాధవుని పూజింప
మనసు బూనితివి గదె! సుగుణవరో! లేలెమ్మా!

తొలికోడి కూసెనే! తెలవారుచున్నదే!
మంచు ముత్యాలతో పుడమి తెల్లనయ్యెనే!
మంచు పచ్చిక మేయ మందగా ధేనువులు
తరలుచున్నవి చూడు తరుణి! వే లేవమ్మా!

చప్పట్లు తాళముల సరసగీతములతో
స్నానమాడగ బోవ జలజాక్షులను నిలిపి
నిను లేపవచ్చితిని నీరజాక్షిరో! లెమ్మా!
కలువకన్నులు తెరచి కాంతా! వేరాగదవె!

తొలి పొడవె చూడు! తోరణము కట్టెనే!
కమలములు వికసించె! కలువలవె ముకుళించె!
పూర్ణపురుషుని గొలువ పూన్కి పట్టితిమిగదె!
జాలంబు సేయగా జలజాక్షి తగునటె?

అశ్వముఖ రక్కసుని యణచివేసినవాని
చాణూర ముష్టికుల స్వర్గ మంపినవాని!
వీణాది వాద్యముల వేడుకను భజియింప
మన కోరికల దీర్చి మన్నించునే చెలియా!

# 9

మామయ్య కూతురా! సుగుణ! లే! తెలవారె!
ఇన ఇన్నాళ్లు తెఱవవి కాంతా! నా మాట విను!
మణికవాటము తెఱచి మముగూడ రాగదే
జలకమాడగ బోవు జలజాక్షులము చెలియ!

పరిమళపు దీపముల పసిడికాంతులు వెలయు
మణిఖచిత సౌధమున సెజ్జబగు శయ్య!
నియమమును విడనాడి నిదురించుచుంటివా?
తామరలు వికసించె తరుణి! ఇక లేవమ్మ!

మార్గళీ మాస మన మాట మఱచితివేమొ?
మాధవుని పూజింప మర్యాద దాటితివో?
స్నానంబు లాడుటకు సఖియ! భయపడితివో?
కలువలవె ముకుళించె! కాంత! ఇక లేవమ్మ!

అత్త! నీ సుకుమారి అవిటిదా? చెవిటిదా?
మూగదా? మురిపాల ముద్దు నీ చిన్నారి!
ఎటు కదలకుండగను పటుమంత్ర మేసితివ?
గాఢ నిద్రాల మునుగ కట్టు కట్టితివేమొ?

జలకంబులాడుటకు సమయమాయె నటంచు
నీ ముద్దులాడి నిక నిదుర లేపవె అత్త!
శ్రీకరా! పరమాత్మ! శ్రీరామ! కృష్ణ! యని
వేయి హరినామములు వేడ్క పాడితిమిగద!

## 10

ఓ సఖి! ఓ చెలీ! ఒకమాట పలుకవే!
మనసి కవాటము తెఱచి మాతోడ పాడవే!

హరినామ కీర్తనలు హరియించు పాపములు!
గొంతుకలుపవె చెలియ! గోవింద స్తుతులతో!

తలుపు తీయక నీవు తగ లోపలన యుండి
మగనితో! మా మాట మన్నించకున్నావు!
అటులైన సరి సరియె! అటులె లోపలయుండి
కలుపవే నీ గొంతు కమలాక్షు కీర్తనల!

పసితి హరి వ్రతముచే పరమ సుఖముల నంది
అనుభవింపగ గోరు అతివ! మా తల్లిగదు!
నిదుర మేల్కొనవమ్మ! నీలవర్ణుని దలచి
గొంతు కలుపవె చెలియ! గోవిందు కీర్తనల

వైజయంతీమాల వక్షమున ధరియించి
పంచాయుధములతో పాలించు లోకములు!
ఆదిమధ్యాంతముల నలరెడి పర జ్యోతి!
పరభాగ్యముల నిచ్చి పాలించునే చెలియ!

అల కుంభకర్ణుడు అలరి యోటమి నొంది
తన నిద్దురను నీకు తగనిచ్చి పోయెనా?
పరమాప్తముం బొంది పతితపావను కృపను
పరమార్థమును బొంది పరమసుఖ మందవే!

# 11

లేవె శుభగాత్రి! యిటు రావె! శోభనమూర్తి!
ప్రవరాగమున బుట్టి వర్థిల్లు లతికా!
చంద్రబింబము బోలు అందాల మోముతో
కలువపూవు సొగసు కనులొప్పు సుకుమారి!

కుండ పొదుగుల ధేను కోటి గలవారింట
సిరిసంపదల తోడ చెన్నారు గృహమందు!
పావనుల కులములో పరగ బుట్టినదాన
ఓసి శ్రీమంతురాలా! ఓసి ఒయ్యారీ!

ఈ మార్గళీ మాస మింపొదగా రోజు
తెలిరేకను ముందుగ 'తిరుమలేశా!' యనుచు
జలకంబులాడి హరి జలజాక్షు పూజింప
వ్రతిని బూనితిమి గదె! యతివ! మఱచితివేమొ!

ఇందీవరశ్యాము సుందరుని మోహనుని
సర్వేశు భజియించు సఖియ లందఱ మమ్మ!
నీ తలపు వాకిటను నిలిచి పాడే మేము
నీవారమె సఖి! నిదుర లేవే చెలియ!

పంకజాక్షుని పాదపద్మములు వర్ణించి
ఇమ్మని నిదురింప కొమ్మ తగునా నీకు?
జలకంబు లాడుదము! జలజాక్షు పూజింప
ఇహపర సుఖముల బొందగ నింతి వెల్వడవమ్మ!

# 12

ఏమి నిదురోగాని యెఱుఁగమే చెలియా!
ఏ మాయ క్రమ్మెనో యెఱుఁగమే ప్రియా!

నీ చిన్ని మనసంటు నీరజాక్షుని బిలిచి
మాయనిదురకు మనుగ మతులు కొని తెసుబోండె!

నీదు వాకిలిముందు నిలిచి జామైనదే!
మంచు ముత్యాలతో మా తలలు తడిసెనే!
ఏ మాయ నిదురయో యేపుగా నిను జుట్టె
కమలాననా! లెమ్మ! కాంత! తేజోవతీ!

తమ లేగలకు తమకోని చేపుగొనుచున్న
ఆల చను మొనలు క్షీరములు కురియుచుండె!
ఉదయ సంధ్యా కాంతు లోలాడె తూర్పు దెస
కమలములు కొలనిలో కాంతి వికసించెనే!

ఇలలేని సంపదలు గల వాని చెల్లెలా!
మా యమ్మ! మా తల్లి! మా ముద్దుగుమ్మరో!
మాయ నిదురను విడిచి మది నిలిపి హరిపైని
జలకంబులాడి శ్రీ జలజాక్షు పూజింపు!

రావణుని మునుమాడు రామకథ నంతటిని
పాటపాడగ ప్రజలు పారవశ్యము గొనిరి!
వీధి వారందఱు విని వెఱగుకొనిరి సఖి!
ఔరౌర! యింకేల యరి లేవవు నిదుర!

# 13

తెలవారుచున్నదమ్మా! మాయమ్మా!
తొలికోడి కూత వినవమ్మా!
లేడి కన్నులదాన! లేవె బంగరు బొమ్మా!
భగవంతు పూజింప భక్తితో మేలుకొను!

[illegible] పరమ పురుషుని హరిని
చరితమును నాలపించుట వినవె?
భామ లందఱ గూడి భక్తి స్నానము జేయ
వైళంగ పూజింప వగవన్నె! జని రెపుడో!

పక్షులు నీ మేతకై పయనమగుచున్నవే!
గురుడస్తమించెనే గుడి తలుపు తెఱచిరే!
వేగుచుక్కయు పొడిచె! వేడుకను బాలకులు
పాఠములు పద్యాలు పఠియించుచుండిరే!

ఈ పుణ్య హేమంత మీ మార్గశీర్షమున
సఖియలందఱి గూడి స్నానమాడక యిటుల!
ఈ నిదుర యేలనే? యీ రీతి తగునటే?
సఖియ! మన చెలులంత స్నానమాడగ జనిరి!

మల్లె మాలతి, పొగడ, మాలతీ పుష్పముల
హరిని పూజించి నీ వేడుకొను సంపదలు!
చెలులతో గూడికొని శ్రీ హరిని పూజింపు!
సౌభాగ్యముల బొంది పరమార్థమందవే!

## 14

నిదరలేవే చెలియ! నీటు బంగరు బొమ్మ
అలరి నా పిలుపు నాలింపు దొరసాని

తొలిసంధ్య రెక్షిలవె! తూర్పు దెస వికసించె!
జలకమాడగ రావె! జలజాక్షి! సుకుమారి!

కమలములు వికసించె! కలువలవె! ముకుళించె!
తిరునామములతోడ తరుణి! జియ్యరులదిగో!
కుంచెకోలల తోడ గుడి తలుపులను తీయు
నరుగుచున్నారదిగొ! అలరు గీత ధ్వనుల!

మునులు, యోగులు ముక్తి మూలపురుషుని హరిని
ధ్యానించుచుండిరదె! జ్ఞాన వైరాగ్యముల!
శ్రీవిష్ణు భక్తులదె! చిద్విలాసుని గొలువ!
హరి కీర్తనలతోడ నరుగుచున్నారదిగొ

నేనె మీ దరి జేరి నిదుర లేపుదు ననుచు
నెఱవాది మాటలను నీటు గులికితివి గాని
సిగ్గుపడవేమిటే! చేటి! నీ మాటలకు
ఆడి తప్పిన దానవైతివే! చెలియరో

అమ్మ దొంగా! ఎంత అల్లారు ముద్దువే!
ఇంత నిద్దుర తగునె? యింతి నీకే తగును!
మధుర వచనములచే సుముఖునే వేడ రావె
పతిత పావనుని శ్రీ పరమాత్ము బ్రార్థింప!

# 15

## శ్రీ గోదా దేవి

“ఓ చిఱుత రాచిలుకా! ఓ మధుర శుభవాణీ!
వారిపూజ మఱచి యిటు అలస నిద్దుర తగునా?
నీ కొఱకు వేచి యిటు నిలిచి యున్నారమె
ఇకనైన లే లెమ్మ! ఇంతి! జలకములాడ!

నోము మాటను మఱచి నేమమును విడనాడి
హాస్యోక్తులను మాను యతివ! యిది తగునటే?
ఎవరి నెవరిని ఇటులే యెటుల దోచితివి చెలి?
వేచియుంటిమి! పిలుపు విని వేగ రాగదే!”

## చెలియ

‘ వడిగారి తనముతో నొవ్వజేయకుడమ్మ!
తొలికోడి కూయగా తొయ్యలీ! లేచితిని!
మాయ నిద్దుర గమ్మి మఱచి నిదురను బోతి!
క్షణ మాగరమ్మ! యిదె! చనుదెంచు చుంటినే!”

## శ్రీ గోదా దేవి

“క్షణమునగ దినమాయె! గడియ యన వత్సరము
గడచిపోవుట యన్న కావలయు యుగముతో!
సఖియ! నీ చతురత్వ సామర్థ్యములు తెలియు
గడుసు దానా! వేగ కదులు! జలకములాడ!”

## చెలియ

"గడుసుదాన నటంచు గసరుకొనకండమ్మ!
మాట మించితే యందు మఱి మీరె చతురులూ!
కోపగించకు తొందు! కొందరు మీ మాటలకు
జలకంబులాడ మన చెలులంత వచ్చిరా?"

## శ్రీ గోదా దేవి

"వచ్చినారమ్మ! యిక విచ్చేయవే కొమ్మ!
ఒక్క రొక్కరినిగా లెక్కించుకోవమ్మ!
హరినామములతోడ యఱచి నిను పిలుచుచు
ఇచటనె తెలవారె! యింతి! నీ వాకిటను!

కరిని గాచినవాని కల్యాణ ధాముని!
విశ్వరూపుని వేద విమల స్వరూపుని!
పూజింపగా మేము పోతి! పోవలయునే!
చరచరా రావమ్మ! చాన! జలకములాడ!"

# 16

[గోపికలు యమునానదిలో స్నానము చేసి స్వామిని దర్శించుటకై హరిమందిరమున కేతెంచి హరిద్వార రక్షకులను ప్రార్థించుట]

హరి ద్వారమున నిలుచు అయ్యలారా వినుడు!
హరిమందిర మహా ద్వారపాలకులారా!
సుందర మణుల అద్దాల తోరణాల్
రాజిల్లు హరిద్వార రక్షకులు వందనము!

వందనంబులు మావి ముందుగా గొనుడయ్యా!
వద్దు కాదని పలికి మళ్ళి రమ్మనకుడీ!
మణి కవాటము తెఱచి మన్నించవ మా మనవి
అట్టె స్వామిని జూచి యిట్టె పోవుదుమయ్యా!

వ్రత మాచరించుటకు వరతార వాద్యములు
ఇత్తు నని పలికె హరి యింపుగా మాతోడ!
జలకంబులాడి శ్రీ జలజాక్షు దర్శింప
పూజింప వచ్చితిమి! పుణ్యపురుషులు వినుడు!

కల్ల కపటము లేని గొల్ల కన్నెలమన్న!
సుందరుని గోవిందు జూడ వచ్చితిమన్న!
నల్లనగు స్వామిపై నాట్యము తో పాడి
పూవు ర్పించి మా పురమునకు బోయెదము!

గోపాల దేవునకు కూర్మి దాసులమయ్యా!
తలుపు ను తెఱచి మము దర్శింపనిండయ్యా!
కైశికీ రాగమున కల్యాణ ధామునికి
మేలుకొలుపులు పాడి మేమిదే పోయెదము!

# 17

[స్వామికి మేలుకొలుపు పాటట]

మేలుకొను! గోవింద! మేలుకొను గోపా!
ఆపన్న రక్షక ఆనందకర పరమాత్మ!
అన్న వస్త్రము లిచ్చి ఆలించు పాలించు
పరమపురుషా! నీకు ప్రణతి లివె! గైకొనుము!

తొలి సంధ్య ఉదయాద్రి తేలియాడ మునుపు
యమునా తరంగిణీ యమున జలకము లాడి
నీ దర్శనము గోరి నీ ధ్యానమున నిలిచి
వేచి యున్నామయ్యా! వే నిదుర లేవయ్యా!

తన్వీ! వ్రజభామినీ! తల్లీ! యశోదమ్మ!
వందన బులు గొనుము! సంరక్ష్యా దీక్షమా!
అల్లనల్లన లేచి మెల్లగా శ్రీహరిని
మేలుకొలుపుము తల్లి! మేలు జగతికి కలుగు!

మూడు లోకంబులను మూడడుగు ల గొలిచి
ఆక్రమించితివయ్యా! ఖిలేక నెటుడవై!
పాలించు నీ నిరుపమ లోకేశ్వరా
పాలించుము దయ భద్ర! జీవేశ్వరా!

మేలుకొను బలదేవ! మేలుకొను బలవీర!
కనక మాణిక్యంబు కదరాక పాదమున!
తమ్ముడగు హరితోడ తొంగొదుర లేవయ్యా!
మేలుకొని మా వినతి మేలుకో! దయ చుమ్మ!

 

# 18

యశోదకు ముద్దు అందాల గోపాలా!
అఖిల లోకేశ్వరుని యర్ధాంగి! శ్రీదేవి!
ఓ నీలసుందరీ! ఓయమ్మా! మేలుకొను!
తలుపు తీయుము తల్లి దయగనుము మాపైనా!

తొలికోడి కూసినది! తొలిసంధ్య వెలుగొందె
గురివింద పొదలలో గోరింక పలికినది!
పంజరములో చిలుక పలుకు వినవేమమ్మా!
తలుపు తీయవదేమి? తప్పేమి మామీద?

కందుకము, కమలమున కరమూని ధరియించి
శ్రీహరికి సన్నిధిని చేరి నిలిచే దేవి!
చంద్రబింబము మించు అందాల మోముతో
అలరి భక్తుల కోర్కె లందించు మహాలక్ష్మి!

హరి సేవకై మేము అరిగి వచ్చితిమమ్మా!
కరుణ చూపుమమ్మా! శ్రీ కల్యాణి! వరలక్ష్మి!
అందరమునూ గూడి శ్రీ హరినామముల భక్తి
పాడుకొందము తల్లి! పాటించు మా మనవి!

నిదుర మేల్కొనుమమ్మా! నీరజాక్షి! సరోజ!
పరమ సిరులకు కల్పవల్లి! జగదీశ్వరీ!
శ్రీహరిని దర్శింప జేయవచ్చితిమమ్మా!
కల్యాణి! హరిజేరు కాంక్ష నెరవేర్పుమా!

# 19

గజరాజ వరద! శ్రీ కమలాక్ష! మాధవా
పలుకవా ఒకమాఱు? పలుకు! బంగారమా?

నోరార పలుకగా నోటి ముత్తెములన్ని
రాలునా? జారునా? మేలుకొను జగదీశ

కప్పురపు దీపాల గదియందు సుకుమార
అగరు ధూపములతో ఆనందమును గొలుపు -
పరిమళము వెదజల్లు పాన్పుపై శయనించు
పరమపురుషా! లేచి పలుకవా? ఒకసారి!

వికసించు విరులు కడు వేడ్క కొప్పున దాల్చి
పరమ సిరులకు కల్పవల్లి! జగదీశ్వరి!
పదములొత్తుచున్నాడ పాన్పుపై శయనించు
మాధవా! ఒకమాఱు మన్నింపు మా వినతి

నిదుర లే! గోపాల! నిదుర లే! గోపిక!
వ్రత నియమ పాలనకు వత్తిల్లు కన్నెలము!
స్నానంబులాడ యిట జలజాక్ష! వచ్చితిమి!
నీ దర్శనము గోరి నిదుర మేల్కొనుమయ్యా!

కలువ కన్నుల తల్లి! లక్ష్మీ! శ్రీనీళా!
నీవైన తెలుపుమా! నిఖిలేశ్వరుని తోడ
మణి కవాటము తెఱచి మాధవుని మేల్కొలిపి!
హరితోడ మా మొఱ హరిణాక్షి! తెలుపవే

# 20

మేలుకో! వనమాలి మేలుకో! శ్రీకృష్ణ!
మేలుకో శ్రీనిధీ! మేలుకో తల్లీ!

అఖిల లోకంబులను ఆలించి లాలించి
పాలించు సంపదలు ప్రణతులివె గొనరా!

ఇంద్రాది దేవతల నింపుగా కాపాడి
మునుల యోగుల బ్రోచి మోక్షమిచ్చెడి స్వామి!
వెన్నంటి రాక్షసుల వెతలు తీర్చెడివాడ
ఆపన్నులను గాచు అఖిల లోకేశ్వరా!

గోపకాంతలమయ్య గోవింద! గోపాల!
నీ సేవకై వచ్చి నిలిచితిమి ద్వారమున!
యమునా తరంగిణిని యమలోదకమందు
నీరాడి వచ్చితిమి! నీ పూజకై కృష్ణ!

ఓ నీళ! జగదాంబ ఓ లక్ష్మి! హరిదాసి!
మేలుకో! నిదుర చాలిక మేలుకోవమ్మా!
నవ పుష్పధారిణీ! నవమాల్య శోభినీ!
హరికీర్తనాలాప! తెలుపు మా వినతి!

యమున యొడ్డున జేరి ఆటలను పాటలను
కృష్ణ పూజ చేసి కృష్ణ కీర్తించెదము!
ఆలవట్టము మఱియు నద్దమును వే నిచ్చి
మము జేర నంపవే మాతల్లి! శ్రీహరిని!

# 21

సర్వాంతకమా నాథ లోకేశ్వరా
మెలుకో గోపా మెలుకోవయ్యా!

భక్తజన వత్సలా భద్ర జీవేశ్వరా!
మెలుకొను! తెలవారె! మేలుకోవయ్యా

ఎ గాను విందె గా గి పార గ పాలు!
ని ఙ పాకగ ఎగ మోడు ధేనవులు గ
అల కాద ద్దు లల్లారు మురిపెమా!
వ్రజకాంతలు స్వామి వందనంబులు గొనుము!

దుర్జనుల హరియించి సజ్జనుల కాపాడ!
శాంతి ధర్మము నిలుప సకల జీవుల గావ!
వైకుంఠ ధామమును వదిలి భూలోకమున
మము గావ వచ్చితివి మాధవా! మాపల్లె!

నిగమాగమము లన్ని నీవే సృజించితివి!
నిగమములచేనైన నీవు తెలియగ లేవు!
శత్రురాజు కువలె శరణు జొచ్చితిమయ్యా
ఆలరి మా మొఱను విను అచ్యుతా పరమేశ

నీ చరణములు నమ్మి నిన్ను మదిలో పెంచి
నిర్మలోదకములను నీరాడి వచ్చితిమి!
కైవారములు సేయ కాంతలము జీవేశ!
అంజలులు కైకొనుము ఆదరింపగ లెమ్మ!

# 22

స్వామి! నీ దయ యేది? సరస వీక్షణ మేది?
కరణ మాపై చిలుక! కాంతలము ఎన్నింవు!

ఎట్టి తాపర వలె నింపారు కనుదోయి
మాపైని బలుపుమా! మాధవా! కరుణించి!

శక్తి రాజులు ఓడి శౌర్యమును గోల్పోయి
నీ గద్దె ఎటను నిలిచియుండెడి కీర్తి
మానాభిమానములు మమత ను విడనాడి
తరలి వచ్చితిమయ్యా తెగునయ్యా? యిది నీకు?

మార్గళీ స్నానమును మానినుల మిడె చేసి
ఆడుచును బాడుచును హరిభజన కీర్తనల!
నీ ద్వారమున నిలుచు నీరజాక్షులమయ్యా!
అరమోడ్పు కనులతో నల్లనల్లన జూడు!

సరసిలో పద్మములు ఝుంకారములతోడ
ముసురు తుమ్మెదలవలె ముక్తి కంఠములతో
నీ మందిరము చుట్టు నిలిచినారము దేవ!
చల్లనీ చూపులను జల్లు మాపై కరుణ!

రవి చంద్ర కాంతులను రాజిల్లు వీక్షణము
హరియించు పాపములు ఆర్తి, తాపము మాపు,
నీ కృపా కిరణమే నిఖిల సంపదలకును
తావలము! మోక్షశ్రీ ద్వారమై విలసిల్లు!

# 23

తలిరాగదనయ్యా! దయచేయవే స్వామి!
పాలింపగానయ్యా! పరమ పురుషోత్తమా!

దర్శింపవచ్చినా తరుణులము పరమాత్మా!
పరవాద్యముల గోరు వ్రజకాంతలము స్వామి!

పాలకడలిని శేషపాన్పుపై పవళించు
మధుసూదనా రమ్మా! మా మొఱల నాలింపు!
ఆ గజేంద్రుని బ్రోచి యాదరించిన రీతి!
మాపైని దయజూపు! మధుర పీతాంబరను!

సురలు మునిబృందములు స్తుతియింప నీ కీర్తి!
చీఱితివి రక్కసుని నరసింహ రూపమున!
ప్రహ్లాదు కరుణించి, యాహ్లాదమును గూర్చు
సరస వీక్షణములను స్వామి మాపై బఱపు!

వాన కాలమునందు వర్జించి గహనమును
గుహయందు నిదురించి, గ్రుమ్మగా మృగరాజు
జూలు, తనువు విదిల్చి కాలు రేపి కదిలి
గర్జించి వెడలునటు కదలు స్వామీ! వేగ!

శిల్పసౌందర్యముల చెలువొందు బంగారు
రత్నాల గద్దెపై రమణితో గూర్చుండి!
మా మొఱల నాలించి మా పూజలను బొంది!
భాగ్యాలు కురిపింపు! భవజలధి దాటింపు!

# 24

(మేల్కొలిన స్వామికి మంగళ నీరాజనము)

మంగళము గోవింద! మంగళము గోపాల!
మాధవా! వచ్చితిమి! మంగళము పాడ వల!

విశ్వరూపుడ వనుచు విజ్ఞాన దీపమని
కల్యాణములు గూర్చు కారుణ్య మూర్తివని!

మున్ను రెండడుగులను భువి దివిని కొలిచితివి!
బలిని బంపితివిగా! పాతాళ భూములకు!
పల్లవారుణ దివ్య పాద పద్మంబులకు
మంగళం బిదె! నీకు! మాధవా! కరుణింపు!

హీనమదాంధుల గూడి యలలక్ష దానవుల
భూభారమును దీర్చి పుడమి గాచిన దేవ!
సాధుజన హృదయ శ్రీ సకల జీవేశ్వరా!
మంగళము నీదు భుజ మహనీయ శక్తి కిదె!

శకటు రక్కసు బట్టి చిదిమితివి లీలగా!
వత్స రాక్షసు చుట్టి వంచితివి ఖేలగా!
వేణువున నూదుచున వ్రేతకాంతల నెల్ల
మఱపించు మాయ కిదె! మంగళము పరమాత్మ!

అల యమున నదియొడ్డు నాలమందల గాచి
అందాల గొలిపించి యమరులను మురిపించి!
రాసక్రీడల గోపరమణులను నేలించు
ఆనందమూర్తి కిదె! యాత్మాభివందనము!

గొడుగువలె వ్రేలితో గోవర్ధనము నెత్తి
గోపకులమును గాచి గోరక్ష జేసితివి!
నీ రూపగుణములకు నీ నామ కోటులకు
మంగళం బిదె! నీకు మాధవా! గైకొనుము!

దుష్టుల నరిమార్చి శిష్టులను కాపాడు
అరిభయంకరములై యలరారు నీవైన!
శంఖు, చక్రము, గదా, శార్ఙ్గ ఖడ్గములకును
మంగళము! ఇదె నీక మంగళము! జయశీల!

నిరతమును హరిచరణ నెడందున నిలుచు
అడుగు దామరలకును అంజలులు ఘటియించు
సిరులిచ్చు శ్రీదేవి! శ్రీనీళ సుందరి!
మంగళం బిదె నీకు మాతల్లి గైకొనుము!

ద్వారమందున నిలుచు తరుణులను బ్రోతువని
పరవాద్యముల నొసగి భరియింతువని దలచి
కనక పళ్ళెరమందు కర్పూర హారతుల
మంగళంబులు పాడ మాధవా! వచ్చితిమి!

# 26

ఈ మార్గళీ వ్రతము నీడేర్పగా పఱయు
పరవాద్యముల నిచ్చి పాలింపవా స్వామి!

మా పూర్వ వంశజులు మాకు దెలిపినవన్ని
మామీఁద కృప జూపి మాకు దయసేయవా?

గోక్షీరముఁ గన్న కూర్మి తెల తెల్లనగు
కుల పర్వతము లదురు గురునాదముల నొప్పు!
పాంచజన్యముబోలు బహు శంఖముల నిమ్ము!
పెను నాదములు సేయు ఘన వాద్యముల నిమ్ము!

బంగారు పళ్ళెముల మంగళంబగు దీప
శృంగారరావములు మిగుల చెన్నొందు గీతముల!
మంగళాశాసనము మదిపొంగ పఠియించు!
హరిదాసులను మాకు నర్పింపు పరమాత్మ!

దీపమాలిక లుంచు దివ్యమగు స్తంభములు
బహువన్నె ధ్వజములును బహు వితానములును!
తులసీదళములును విలసిల్లు మాలికలు
ఆలపట్టము, అద్దములును దయసేయుమా!

పరమ కారుణ్య! శ్రీభక్తజనవత్సలా
వటపత్రశాయి! మా వరద! ప్రభు! లక్ష్మీశ!
మా నోము ఫలియింప మా కోర్కె లీడేర
అవధరింపుము స్వామి! ఆలించి కరుణింపు!

# 27

[వ్రత సమాప్తి దినమున కొన్ని కోరికలడుగుట]

దుష్ట సంఘము నణచి తూల జేసేవాడ!
ఆశ్రితుల కాపాడి యాదరించే స్వామి!
నీ దరిని జేరితిమి! నిన్నాశ్రయించితిమి!
జన్మములు సఫలమై ధన్యులము నైతి మిల!

కీర్తించి, భజియించి, గీతముల స్తుతియించి
పరవాద్యముల బొంది వ్రత మాచరించితిమి!
వ్రతము ముగిసేవేళ వాసుదేవా కొన్ని
కోరికల మా కిమ్ము! గోవింద! కరుణింపు!

ఆడువారలమని యనాదరము సేయకుము!
తప్పులని దలపకుము! తరుణులము గద స్వామి!
వ్రజ కన్యలము సుమ్మి! వ్రతము ముగిసేవేళ
కోరుచుంటిమి కణ్ణ! కోర్కెలను కొన్నిటిని!

కంటె కాసులపేర్లు, కనకాంబరము లిమ్ము!
నడుమ కొడ్డాణమును నళినాక్ష! యసేయి!
కాళ్ళకందియ లిమ్ము! కడియాలు మెట్టియలు
చెవుల కమ్మలు, చెంపసవరాలు గాజులును

ఆభరణములు దాల్చియలరి వచ్చెదమయ్య !
ఇంత శుభసమయ మికనెపుడు వచ్చును స్వామి?
ఏ జీవులకునైన యీ భాగ్యమబ్బునా ?
పాల్పొన్న మీగడలు పాయసము భక్ష్యములు
బంతులుగ గూర్చుండి భక్షింత మో స్వామి!

# 28

(జన్మ జన్మల భక్తిని బాంధవ్యము గోరుట)

"చిన్నికృష్ణ' యనుచు నిన్ను చిన్న పేర బిలిచిన నను
మన్నింపుము మాధవ నేను నీ సుతునని దయ నెంచి!
పేరు పెట్టి పిలిచితినని నేరమెంచ బోకుమయ్యా!
కోరిన మా కోర్కె లిచ్చి గోవిందా! కరుణించుము!

కొండలలో కోనలలో గోవులు మేపుచు తిరుగుచు
వెఱ్ఱిగొల్ల కులమునందు ప్రేమమైన జననమొందితి!
మాలో నీ వొకరివిగా మాల మంతి మెలగుచుంట
ఎన్ని వ్రతము లాచరించ! యీ భాగ్యము గలిగెనో!

మా నోముల పంటవైన మా పుణ్యము ఫలమనన
మా కొఱకై జననమొంది మాలో నీవొకరివైతి!
గోపకులమునందు జేరి గోవిందుడవైతివయ్యా
విన్నపముల నాలకించి వినిపించుము నీదు శుభము!

ఏ జన్మల బంధనమో ఏ జన్మల వాసనయో!
వీడని యీ విరహబాధము విడదీయుట వలను గాదు!
మా చేతను నీ చేతను మఱలింపగ వశము గాదు!
జన్మ జన్మలీ బంధము జత నేయుము శాశ్వతముగ!

పరమపురుష! పద్మనాభ! భక్తవత్సలా! శ్రీహరి
అజ్ఞానుల మనుగులము! ఆత్మార్పణమయ్య నీకు!
నిన్ను శరణమని నమ్మిన నిరజాక్షులము కృష్ణా!
అన్య మెఱుగమోయి కన్నా! ఆది పురుష! విశ్వరూప!

# 29

మనసు తెలిసిన నీకు మనవి జేయగ వలెనా?
నీకు తెలియని దేమి? విశ్వమాభ్యధికుడవు!
ఆనంద! అచ్యుతా! అఖిలేశ్వరా! శౌరి!
మనకు సాధనము మర్యాద నిలుపుమా!

తెలి కోకిల ముందు తెలవారు జామునను
జేకంబులాడి ఇటు 'జలజాక్ష!' 'శౌరి' యని
ఇష్ట సఖి కూడి పూజించుటలె
పరమాప్యముకు నని భ్రమియించకుము స్వామి!

అడుగు దాముల కిడె ఆత్మార్పణం బనుచు
మధుర భక్తిని గొలిచి మంగళంబులు పాడ!
పుష్పాంజలులతోడ పూజలను సల్పుటను
పరవాద్యములు పొంద పరమ లక్ష్యము గాదు!

గోపకులమున జేరి గోరక్ష జేసితివి!
మన్ను బాలింపగను మాయయందు దిరిగితివి!
మా ప్రాణాలను గొనక మాధవా! మా నేవు!
నీ సాధనము నిటుల నిలుప మా విన్నపము!

ఏ దేవుని జన్మములు ఎన్ని యుగములకైన
వినిపించని గ్రంథమై ముడులువడి యుండవలె!
నీ పూజ! నీ భక్తి! నీ స్మరణ! నిలువ వలె!
రేపటికి! మాపటికి! ఇప్పటికి! ఎప్పటికి!

# 30

(మంగళాశాసనము)

ఈ మార్గళీ వ్రతము నెవ రాచరింతురో!
ఈ పుణ్య గీతము నెవ రాలపింతురో!
ఆనంద ధాముడౌ అఖిలేశు కృపచేత
అఖిలార్థములు బొంది యానందమగు గాత!

వ్రేపల్లెవాడలో గోప కన్నియలంత
పరవాద్యముంబొంది భజయించి శ్రీ హరిం!
ఏ పూజలను జేసి యే ఫలములందిరో!
ఎలుగువారికి శుభము లింపుగ సమకూరు!

విల్లిపుత్తూరు అను పేరు గ్రామమునందు
విష్ణుచిత్తుని తనయ నైన తులసీవనము!
ముప్పదుల కృతుల నిదె ముద్దుగా బాడినది
పఠియించు వారలకు పరమ శుభములు గలుగు!

ఈ భక్తి గీతముల నింపుగా బఠియించి
ఆచరించెడివారి కఖిల శుభములు గలుగు!
పరమార్థమును గలుగు పావనంబగు భక్తి
ఆనందమంగళము లందరు శ్రీహరి కృపను!

హరి చతుర్భుజుడు శ్రీ అఖిలేశు డచ్యుతుడు
భక్తవత్సలుడు శుభ ముక్తిప్రదాయకుడు!
పరమ ప్రసన్నుడౌ పద్మాక్షు దయచేత
మహి ప్రజల కందరికి మంగళంబగు గాత!

